

[ఎడమనుంచి కుడికి]

శ్రీ దేవులపల్లి రామానుజరావు, శ్రీ పర్సా వేంకటేశ్వరరావు గార్లు.

బాల్యస్నేహితుడు, సారస్వత బంధువు రసజ్ఞమూర్తి

# శ్రీ పర్వా వేంకటేశ్వర రావుగారికి

హృదయపూర్వకముగా సమర్పించిన

ప్రేమోపహారము

గ్రంథకర్త

# ప్రకాశకుల విజ్ఞప్తి.

సంస్కృతీనికేతనము పక్షమున యీ గ్రంథము ప్రకటితము.

ఈ సంస్కృతీనికేతనము పోలీసుచర్యకు పూర్వమే అవతరించి కొంత సేవగావించినది. ఈ సేవలో పేర్కొనదగినది ఆంధ్రవిశ్వభారతి పేరుతో శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారి 'ఆంధ్రదేశచరిత్ర సంగ్రహ'మను చిన్నపుస్తకమును ప్రకటించుటకు తోడ్పడుట.

సంస్కృతీ నికేతనము హిందూదేశములో నివసించు ఆంధ్రులందరికొరకు శాంతినికేతన పద్ధతిని ఒక సాంస్కృతిక కేంద్రము ఏర్పాటుజేసి ఆంధ్రసంస్కృతీ సాంప్రదాయాలను పునరుద్ధరించు ఆశయము ఏర్పాటుచేయబడినది.

ఇక ముందు ఈ ఆదర్శముల సాధనకొరకు యీ నికేతనము కృషిచేయగలదు. ఈ కృషిని రసజ్ఞలోకము, ప్రజానీకము హర్షించి ఆదరించగలరని ఆశించుచున్నాము.

కార్యదర్శి,

సంస్కృతీ నికేతనము.

# ఉ ప నే చ ని

'నసాడః కర్తవ్యః కవిభి రసవద్యేస్వవిషయే,' అకలుషితములైన స్వవిషయములను కవులు శోభింపచేయకుండుటయే కర్తవ్యము— అని ఆనందవర్ధనుని ఉపదేశము.

ఆత్మీయభావన ప్రిచోదించినట్లు అభినవ కవులు తమ తమ భణితి భామ్యములను రచనలో నడిపారు. వారిలో శ్రీ రామానుజరావుగారు గణుతికెక్కిన యువకవి.

పచ్చతోరణము అంతా పచ్చగా లేదు. అక్కడక్కడ కట్టెఱ్ఱని రేకులున్నవి. అకలంక ధవళములైన పత్రిపుష్పాదులును కలవు. కదంబ కల్పనలో ఇలాటి మిశ్రిరూప రామణీయకం తప్పదేమో! ఎందుకంటే, ఆయా వర్తమాన సంనివేశ సంపర్కాలను బట్టి కవికంఠము ఉన్ముక్తమై మ్రోగింది. అంతే కాని, ఏకవస్తు విన్యస్తంగా కావ్యరచనకు శుృతికాలేదు. చూడండి, మచ్చుకు మూడు

పైడిబొమ్మవు కావటే పడతినీవు
ఏల కాంచనహారము లింక నీకు ;
నాడు బంగారు లేడికై నాథునంపి
అనుభవింపదె సీతమ్మ వనటలెన్నొ.

ఈ పద్యంలో చక్కని నర్మశృంగారం ఒలికింది. సహజ సౌందర్యానికీ కృత్రిమాలంకారాలకూ— సలక్షణరూపవతులైన సాధ్వీజనమునకూ ఇతరులకూ— గల భేదం సూచ్యార్థంగా అభివ్యంజిత మయింది. ఇక ధ్వనిముఖంగా, తన యభిమత

మునూ— తనపడతికి కాంచనహారాదులపై మనసుపోకుండా ఉండే ఉపాయమునూ— కప్పిపెట్టి గుప్తాగుప్తంగా తన కావ్య స్వరూపమును అందించీ అందించకుండా వదిలివేసారు. అలాగే

చీరసింగారములుచేసి, సిగ్గువీడి
గొప్ప పదవుల యందున గుల్కు- కూయు
పురుషభామామణుల యింటి తరుణులందు
ఖడ్గతిక్కనభార్య లొక్కరును లేరు.

ఇది గాఢమైన కారముపెట్టిన గారెముక్కలాగా చవు లూరుతున్నది. నేటి గొప్పవారి భోగసంపత్తు లిందు వర్ణిత ములు. అయితే, ఆ సంపద్భోగములు జాతికి అసహ్య లజ్జాకర ములుగా ఉన్నవని వ్యంగ్యార్థం ఫలిస్తున్నది. ఈ భావం చెప్ప కుండా చెప్పారు. అంతేకాదు, ఆ ఐశ్వర్యమును వారు సమా ర్జించిన విధానమును కూడా గర్హితమయినదనే సూచన అవి వక్షితంగా వదిలివేసారు. కాగా, ఈ సంపదా— భోగమూ— వారి ఆభిజాత్యమును, అభిమానమును, అక్లీబ నిసర్గములగు సాహస శీలాది జీవద్గుణములను, నమిలి తిని వేసిందని గమ్యమాన మవుతున్నది. చివరకు ఖడ్గతిక్కన కళత్ర ప్రసక్తితో ఆంధ్ర కుటుంబములలో— కులాంగనలలో— ఈ పురుషభామామణుల భోగభాగ్యములు జాతికే మాయని మచ్చలాగా పరిణమించి నవని ధ్వనింపచేసారు. వ్యంగ్యభూమికలో తాడనము తీక్ష్ణంగా ఉన్నా వాచికంలో పరిసన్నత సడల లేదు. ఇట్టి ప్రౌఢరచనా చరణములు కావ్యాములలో కొంచెచిత్రంగా లభిస్తవి.

ఉదుమా ఉద్బోజనం ఇలా కటువుగా ఉన్నా, శీలశోభా సంపన్నహృదయం చూడండి :

ఆ సంధి వేళమూ— పరికరమూ కూడా— కానరాని కఠోరతపనలో . కనకనలాడుతున్నవి. పాషాణాలు కూడా ఆ ప్రత్యుత్కర్షకు మఱిగి, కరిగి, పోతున్నవి. ఆకొన్నపక్షులు ఎండిన వరి యెన్నులమీద వ్రాలినవి. గింజలు లేనందున అవి తినడాని కేమీ లేకపోయింది. వాటి ఆకలి తీఱలేదు. కరుణా కరుణామైన ఆ కఠిన దుర్దశకు తనదారిద్ర్యమే హేతువని పరితపిస్తాడు బీదకాపు. ఇతని హృదయంలో బీదతనమున్నదా !

అలాగే 'సుజాత'లో అంతఃకల్మషాలను కడిగివేసే కరుణ రసము— మంచుకొండమీది సెలయేటి శిశిరబుతూదకమువలె వణికించి స్తంభింపచేస్తున్నది.

"బిడ్డలు లేని బ్రతుకు లేబరముకాగా (ఒక) నిర్భాగ్యరాలు సంసారసుఖమే వలదని నిర్వేదిస్తుంది. 'దేవీ! నాకిప్పుడు భిక్షనీయవా' యని ప్రణతిచేసి మౌనము పూనింది. కన్నులు మాటలాడినవి. నెలతప్పింది. నెల పొడిచినట్లు తొలిచూలాయింది. ఒక సాయంతనపువేళ, తఱిపి బత్తెల పాలను ద్రాక్ష పండ్లను తీసికొని ఆమె దేవికడకు పోవుచుండగా... చిక్కిచివికి యున్న (ఒక) రాకుమారుని దారిలో చూచింది.'' అప్పటి ఆమె మనోవాక్కాయాభి వర్ణనం గుణోదాత్తంగా స్ఫురితమయింది. 'ఆలయము వంకకు— (అసలు) ముందునకే అడుగు పెట్టనేరక— ఇంటిలో చంటిబిడ్డనుకూడా విస్మరించింది. స్మృతిలేక పడియున్న వాని పెదవులలో పాలబొట్లు ఒక్కటొక్కటిగా రాల్చింది. అతడు కన్నులల్లన విప్పి, శిరమునెత్తి— ఇటా అన్నాడు. మాతా నేనిప్పుడు ప్రేమవృత్త మెఱిగితిని.

ఇంక లోకమెల్ల నా కుటుంబమే యగును. మఱుజన్మ కలిగె నేని నీ కడుపున పుట్టగోరుదును. నాకిక ప్రేమయే. మతము.'
( ఈ అనువాకము కవివాక్య ఘటితమే ) ఇది కథాంశము. రసపోషణకు ఉపచారకములగు విభావానుభావయోజన మలా ఉంచుదము. అపత్యగ్రంథి మోక్షణమున గాని పూర్ణప్రేమా విష్కారము కాదు, అను ఉపదేశము వ్యంగ్యంగా భాసించింది. ఇదే కాంతాసమ్మితమైన ఉపదేశమంటే.

తినబోయే వారికి రుచులు చెప్పడం తప్పేమో! కాని నేటి నాగరకుల విందులలో శాకపాక పట్టికను ముందుపెట్టుట ఆచారం. అలాగే రామానుజరావుగారి పాకమునుండి రెండు మూడు గిన్నెలు రుచి చూపడానికి ముందుపెట్టాను. ఈ కవి కావ్యకృషి వదలడం తెలంగాణపు తేనెమాగాణికి తీరని కొఱత కాక తప్పదు. అయినా వేమన్న అన్నట్లు "గంగగోవుపాలు గరిటెడైనా" దొరికినవని తనిసీ తనియక విరమింతును.

రాయప్రోలు సుబ్బారావు

# పచ్చతోరణము

## ఆముక్త మాల్యద

అరుణరేఖలు తూరుపు నందగింప
నప్పుడే స్నాన మొనరించి యతివయొ క్క
తెల్లచీరను ధరియించి నల్ల రైక
దొడిగి కొప్పున పూవులు ముడిచికొనుచు-

కర్ణాగ్రములఁ గుల్కు గన్నేరుపూవులు
తాటంక శోభతో తగవులాడ
సీమంతచుంబి యా శ్రీచూర్ణతిలకంబు
సౌందర్యగరిమతో సరసమాడ
గాలి సోఁకుటచేత కదలెడుముంగురుల్
కనుబొమ్మలం జీరి కౌఁగలింప
చిన్నారిమోమున సిగ్గుల మొగ్గలు
ఉయ్యాల జంపాల లూఁగుచుండ
అంగకంబుల పరువంబు తొంగి చూడ
మలఁగి యిటునటు తిలకించి తలుపు మూసి
నిలువుటద్దంబు కెదురుగా నిలిచియుండి
పాలవెల్లిని విడివచ్చు పద్మవగిది-

చిలుకకొయ్యన విలసిల్లు నలుపుదండ
లల్లనల్లన గ్రహియించి యటుతఁ దాల్చి
ఆత్మసౌందర్యము న్గాంచి అత్తి శయాన
మురిసిపోవుచు నుండెను మూర్తమందు-

ధవళయజ్ఞోపవీతంబు ద్వాదశోర్ధ్వ
పుండ్రములు బ్రహ్మ తేజమ్ము పుక్కిలింప
వనితవదనంబు వెంటనే వాడిపోవ
వైష్ణవోత్తముఁ డొక్కఁడు వచ్చి చూచి-

కోపవేగాన మాటాడనోపఁ డయ్యె
కనులు రెండును నిప్పులకణిక లయ్యె
సుదతి యది చూచి భీతిల్లి గదిని వీడి
వెలుపలకుఁ బోవ నుంకించు వేళయందు-

అపరాధం బపచారమంచు నతఁ డయ్యబ్జాక్షి నీక్షించి నీ
చపలస్వాంతము నే మనందు నకటా శ్యామంతికా దామముల్
అపురూపంబుగ గ్రుచ్చి తా హరికి నీవర్పించి నేఁ డిట్టులన్
అపరిగ్రాహ్యముగా నొనర్చితె తనూజా, యెంత దౌర్భాగ్యుడన్.

కోరుకులవంట బంగారుకూఁతురంచు
తలఁపుపూవులదండను దాల్చి యుండి
దోసములదొంతివై నాదు నాస లెల్ల
త్రుంచివైతు వ టంచు నే నెంచనైతి-

అనుచు నేమేమో వచియించునవసరాన
కన్నుఁగొలుకుల నశ్రువు ల్గారి తళ్కు-
చెక్కు-లను జాఱ వదనంబు చిన్నవోవ
మాఱు మాటాడనేర కా, మధురమూర్తి.

నిల్చి యట నుండ నోపక నిర్గమించి
అనుగుచెల్లెలివలెఁ బెంచు నలరుఁదోఁట
కరుగునెడ పల్కె- నెచటికే అక్క- యనుచు
పంజరంబున రాచిల్క- పసిడిముల్క-.

మాధవుసేవకై మాలిక లర్పింప
నోచనైతి నటంచు నొచ్చుకొనుచు
నెత్తురు లొల్కె-డు నిండుమనంబుతో
తనయ పోయెడుచొప్పు తలఁచి తలఁచి
ఎన్నాళ్ళనుండియో యీరీతి యీముక్త
దామంబు లర్పించుతప్పుజేయ
యేమి దలంచెనో యిందీవరాక్షుండు
తెలియనైతి నటంచు దీనుఁడగుచు

కాఱుమబ్బులు హృదయంపు గగనమందు
తఱుముకొని రాఁగ నహ్మాని తాళలేక
శిరము వాల్చి మోమునచేయి జేర్చి
దేవపూజకు వేళ యతిక్రమించె.

నెమ్మనంబున నిప్పులు నిండుకొనఁగ
నేమి చేయంగవలయునో యెఱుఁగ కపుడు.
చిత్రపటమునుబోలె నాసీనుఁ డయ్యె
తాటియాకులచాపపై ధరణిసురుఁడు.

చల్లనిసోగచూపులును చక్కని చామనచాయరూపముగా
పల్లవకోమలంబు లగు పచ్చనిచెక్కుల జాఱుచెమ్మటల్
పుల్లనవారవిందములపోల్పు హసించెడుపాదయుగ్మమం
దల్లన మ్రోయునందియలు, నందము జిందగ నప్పు డచ్చటన్—

కాంచినంతనె బిగియార కౌఁగలింప
కోర్కెతీఁగలు కుసుమించి కొనలు సాగ
రసిక సుకుమారమూర్తి శ్రీరంగనాథుఁ
డెదుట కన్పట్టె యాతని కిట్టు లనియె—

అనుదినంబును కోవెల కరుగుదెంచి
అలరుకానుకల నిచ్చి మ మ్మలరఁజేయు
వాఁడ వీవతి తేజంబు వాసి నేఁడు
మమ్ము మఱచితి వేలొకో మానిచంద్ర?

తెలిసె భవదీయఖేదంబు తెఱఁగు మాకు
వేలలందున మిక్కిలి వేల వీవు
ఇన్నిదినములనుండియు నెఱుఁగ వైతి
మాకు నీ సుతయంగళోమధుర మైత్రి.

అధికభోగ్యంబు మాకు నీయనుఁగుపుత్రి
తొలుత తాఁ దాల్చి యర్పించు నలరుదండ
కాన చింతింపమాను మో మౌనివర్య
ఆమె మా ప్రేమవనములో నలరుచిల్క—!

# విజయానంద గజపతి

సాహితీసతికిఁ దోడ సంసార మొనరించు
రసికాంధ్రరాజుల రాజసంబు
మగఁటిమి దాల్చిన మగరూపమో యన
వెలుగొందు క్షత్రియ విక్రమంబు
తుచ్ఛభోగంబుల దూరంబు తొలఁగించి
ప్రజల దుఃఖములందు పాలు గొనుట
ఆత్మదేశమునకై యసువుల నర్పించు,
ప్రథిత శౌర్య ప్రాభవంబు కలిమి
మేలిగొనము ల వెన్నియో మేళవించి
ఆకృతిని దాల్చి నీమూర్తి నాశ్రయించె
కంకణంబును బంధించి కదలుమయ్య,
తల్లి దాస్యంబు నెడఁబాప దక్షుఁడీవ.

మా యక్క-చెల్లెండ్రు మంగళారతి బూని
నీరాజనంబులు నీ కొసంగ
హుంకార మొనరించి వెంకటప్పయకోడ
ఆంధ్ర కేసరి నిన్ను ననుసరింప
మా యన్నదమ్ములు మఱచి విద్వేషంబు
సీదు చల్లని నీడ నిల్చియుండ
విజయయాత్రకుఁ బోవ వేదవాక్కుల నీకు
సాంబమూర్తి మహర్షి స్వస్తిచెప్ప

ఆంధ్రరాష్ట్రము గ్రహియించి యరుగుదెమ్ము
అల కురుక్షేత్రరణమున నతిశయించు
విజయుసింబోలె శీఘ్రమే విజయ నీవు
తెనుఁగుదేశమ్ము ఇఁక నీ యధీన మయ్యె!

ఉయ్యాల లూఁగుచు నొయ్యార మొలికించు
కలభాషిణిం జూడు కన్నులార
పరిమళమ్ములు చిమ్ము పారిజాతమునీడ
పరికించు మొగ మెత్తి భామసొగసు
ఆలింపు నరముల నాంధ్రరక్తము పొంగ
పాంచాలి పౌరుషభాషణాలు
పఠియింపు మొకసారి పాండవేయులమాత
సందేశమును మేను జలదరింప

గొల్లభామలవలపుల వల్లభుండు
మురళి వాయింప చెవి యొగ్గి మురిసిపొమ్ము
తెలుఁగుమేడల విలసిల్లు దీపకాంతి
కనుల మిఱుమిట్లు గొలుపదే కనుము విజయ.

నవమల్లికాసతి నగుమోము తిలకించి
ముద్దాడకుండునే మోహనాంగి
మెఱుపునెచ్చెలితోడ మేఘుంబు విహరింప
పురివిప్పదే నెమ్మి పొలుపుమీఱ

మూరామెనర్చెడు గారావు కూఁతురు
　　　　సంతసం బొందదే చంద్రుఁ జూచి •
నిగనిగమెరపలు పగడాలు ప్రసవింప
　　　　కవి కర్షకుఁడు కుప్పిగంతు లిడడె
ఆంధ్రరాష్ట్రపుగద్దియ నధివసించి
విజయశంఖము పూరించి విక్రమింప
అనుసరింపక యుండునే ఆంధ్రజాతి
విజయకన్యక విరిదండ వేయు నీకు

# ఓరుఁగల్లు

కాఁబోలు నియ్యది కాకతీయు లొకప్డు
కఱకునెత్తుట కత్తి కడుగుచోటు
కాఁబోలు నీ ద్వారకల్యాణవేదిక
అలికి ముగ్గులు పెట్టి తెలుఁగుపడుచు
కాఁబోలు నీ జీర్ణకమనీయసౌధాన
సుకుమారశిల్పము లొసొంపు లొలికె
కాఁబోలు నీ వీధి కాఁపురం బొనరించె
పైఁడిమేడలలోన భాగ్యలక్ష్మి
ఇచటనే నిల్చి కాఁబోలు నిందుముఖులు
ఆయుధంబులు పూజించి యరుగుదెంచు
ఆంధ్రసేనకు కపురంపు టారతులను
ఇచ్చి వారలశౌర్యంబు మెచ్చినారు.

ఆంధ్రనగరీ యని అల్లారు ముద్దుగా
పిలిచె విద్యానాథుఁ డెలమి నీమె
అల్లుని స్వేచ్ఛకై నెల్లూరినెఱజాణ
పఠియించె నిచటనే భారతంబు
జాను తెనుంగున శైవప్రబంధము
ల్లోలకెత్తి యిచటనే మొగ్గదొడగె
సుందరమందార సుమదామ మొక్కటి
పోతన గ్రుచ్చె నీ పొలమునందు

ఆర్ద్రహృదయాన నెందరో ఆంధ్రకవులు
ఆలపించిరి యిచటనే ఆత్మగీతి
తలఁచినంతనె మే నెల్ల పులకరించు
అక్కటా నాఁటిశోభ యేమాయె నేఁడు!

తిక్కనామాత్యుండు తెలుఁగుదేశపురాజు
కలిసి మాటాడిన కొలు వి దేమొ
అన్యదేశాధీశు లర్పించు కానుకల
ఆరాజు లిచటనే అందిరేమొ
కాటుకకన్నుల కావ్యకన్యక నాఁడు
పోతన నిచటనే పొల్చెనేమొ
పురికొల్పెనో యేమొ పూఁబోఁడి యొక్కర్తు
రణరంగమున కేగ రమణు నిచట
అనుఁగుమిత్రుని గోడుత నాంధ్రనగరి
వీధిగడియారపుస్రోఁత వినియొకండు
పూఁటకూటింటి కల్లన బోయి ముదము
గులుక విం దారగించిన స్థల మిదేమొ!

ఈ చెర్వుగట్టున నాచరించెనొ యేమొ
సహగమనంబును సాధ్వియొర్తు
ఆ కోటబురుజుపై సతిశయించెనొ యేమొ
ఆత్మదేశంబుకై ఆంధ్రుఁ డొకఁడు

త్రోడికోడంద్రక్రో తోయ్యాలి యొక్కర్తు
• పూజించె గౌరి నీ పొంత నేమొ
వేదశాస్త్రంబుల విడిది బ్రాహ్మణవీధి
చూడ్కి కిం పొసరించు చోటిదేమొ

ఎన్ని సంపద లుండిన నేమి ఫలము
చచ్చిపోయిన యొకబట్టె యిచ్చెనంట
పగిలిపోయినకుండెడు పాలు మాకు
నిద్దురను వీడు తమ్ముడా, ప్రొద్దుపోయె!

రత్నాలు వజ్రాలు రాసులుగాఁ బోసి
అంగళ్ల నిచటనే అమ్మినారు
పట్టుకంబళ్ళపై బంగారు నచ్చన
గాయకుల నాడిరి కాంత లిచట
ఉడుకురక్తము పొంగ హుంకార మొనరించి
అలరారె నిచట మా ఆంధ్రసేన
బంగారమునుగూడ పండించి రంట మా
హాలికప్రవరు లీ ఆంధ్రభూమి

మా ప్రతాపనరేంద్రుని మానవతులు
వల్లభుని గూడి యిచ్చటి మల్లెతోఁట
సిగ్గుతీవియ తొడగిన మొగ్గ లగుచు
తూఁగుటుయ్యాలలందున నూఁగిరంట.

# పూలచెట్లు

చిన్నిబంగారుచేతుల చెంబు నెత్తి
ప్రొద్దుపొడుపున జనుదెంచి పూలచెట్ల
కిట్లు నీర్వోసి శ్రమియించె దీవు తల్లి
ఎన్నిజన్మాలబంధమో యెవరి కెఱుక!

చెట్లమీఁదనె యుండు నీ చిత్త మెపుడొ
పూలు వాడక ఆకులు రాలకుండ
వరము కోరగ మొన్న నీ వరిగితంట
శ్యామలాదేవి మందిరసముఖమునకు.

తలిరుబిడ్డలఁ జూచిన, తల్లి కట్లు
ప్రాణములు లేచివచ్చును బాల, నీవు
ముందు పిల్లల తల్లివై మురియునపుడు
ఎంత ప్రేమించి పోషింతు వేమొ వారి ?

అన్నమును బెట్టి దంచును అమ్మ నిన్ను
పిలిచె ఆకలివేళయు తెలియనైతి
పరహితంబున తన్నుఁ దా మఱచు టరయ
వెన్నతో నీకుఁ బెట్టిన విద్య యేమొ.

"ఏమొ వచియించుచుంటివి ఇంతసేపు
చాలు నిఁక నీదు మాటలు చాలు" ననుచు
కిలకిలను నవ్వ దానిమ్మ్రగింజ లిలను
రాలె నను భ్రాంతి ఆ చిల్క వ్రాలె నేమొ!

రస నిధానంబో యేమొ నీ రమ్యమూర్తి
చూచునపు డెల్ల నొక క్రొత్త సోయగంబు
మినుకు మను తారకలవోలె మెఱయుచుండు
ఎచటిబాంధవ్యమో మాకు నిగురుఁబోఁడి !

కోసి తెచ్చితి వా పూలు కోరెదేని
కొప్పునన్ ధరియింపు మో కోమలాంగి !
వలదు మాకలి ; చాలు, నీ వదనసీమ
నవ్వుతీవలె విరబూచు పువ్వు లబల !

తలిరు కన్నియసొమ్ములు తస్కరించి
కులికినంతన యే మాయె గోల వకట
ఎన్నిరోజుల సంబర మీ విధంబు
ఎరువుసొమ్ములు గాకున్నె బరువుచేటు !



ఎవరు లేరని కాంబోలు ఎంచి నీవు
అద్దమున కెట్టయెదుటన అట్టె నిలిచి
పాడితివి మోహనముగ ప్రణయగీతి
ముద్దు గొలిపెనో చెలియ, నీమోము నీకె ?

మమ్ముఁ జూచినయంతనె మధుర మంద
హాస మొనరించి సిగ్గున నవల కేగి
పాట నాపఁగ మా ఘోరపాప మేమొ ?
అప్పులము కామె నీ గాన మాలకింప ?

'అతివ, మఱి యొక్కమాఱు నీ యార్ద్రగీతి'
అనుచు ప్రార్థింప నీ వేమొ ఆగ్రహించి
"తీయమాటల సంతృప్తి జేయఁ జూతు
రెప్పుడును ఇంతె" యని పల్కె దింతి, నీవు-

పైఁడిబొమ్మవు గావె యో పడఁతి, నీవు ?
ఏల కాంచన హారము లింక నీకు ?
నాఁడు బంగరులేఁడికై నాథు నంపి
అనుభవింపదె సీతమ్మ వనట లెన్నొ ?

♦ ♦ ♦

ఆలయద్వార వేదియం దడుగు వెట్టి
చెలియ యొక్కతె చెక్కిలి చేయివైచి
ఏమొ వచియించు నంత కే నీ మొగంబు
మందహాస వికాసమై యంద మొల్కె.

ఉపవసించుటనో యేమొ ఒప్పులొలుకు
వదన కుసుమంబు ఇసుమంత వాడువాఱి
కమ్మతావులె మా మీఁదఁ గ్రుమ్మరించి
ఎన్ని నోములఫల మొకో యీ ప్రియంబు.

పసిడి పళ్ళెరమందున పారిజాత
పుష్పములు భక్తితోఁ గొనిపోవనేల
పరిమళింపవా యవి నీదుశిరమునందు
జగతి నవ్వాని కందుకే జన్మ మబల !

ఔను, మఱచితి నెచ్చెలీ, అలరు లిపుడు
దేవపూజకు కాఁబోలు తెచ్చినావు
కాని దేవదేవునకు నవ్వానికన్న
హృదయపుష్పంబె మిక్కిలి ముదముగూర్చు.

♦ ♦ ♦ ♦

చూతు ప్రతినాఁడు నీ ముద్దు సోయగంబు
కామకాంక్షలె నా యెద న్గలఁచివైచు
చిత్ర మీనాఁడు నీ మోము సిరిని జూచి
పూజ సేయగ నేలకో బుద్ధి పొడమె.

సకియ, నినుఁ జూచినంతనే సరసమాడి
ఆజ్ఞసేయుదు సేవల నాచరింప
కలిగె కోరిక యేలనో కరముమోడ్చి
నీదు నాజ్ఞల నీ నాఁడు నిర్వహింప.

♦ ♦ ♦

కలికి, నీ చక్కఁదనమున కలరి యేను
కోసి క్రుచ్చిన [illegible]మంత కోపపడక

పరిమళంబులు వెదఁజల్లి మురిసిపోవు
పూలమాలిక నిజముగా బేల కాదె?

పరమ సుకుమార మైన నీ కరము నెత్తి
తీఁగెలను వ్రేలు పూవులఁ ద్రెంచి కట్టి
తల్లిబిడ్డల నెడఁబాప ధర్మ మొకొ?
పిల్లల న్గని పెంచవో బిసరుహాక్షి?

ప్రకృతి సౌందర్యశోభల పాడుచేయ
పాప మది యే మొనర్చెనే భామ, నీకు?
తనదు సొమ్ముల నీ విట్లు తస్కరింప
చూడు మా తీవ కన్నీళ్లు వీడుచుండె—

ఎన్ని ప్రశ్నంబు లడగిన నేమి ఫలము
అలుకబూనితివో యేమో పలుక వేమె?
పెదవిపగడంబు లల్లన కదలినంత
రమణి నీ నోట ముత్యాలు రాలిపోవు.



కనులకాటుక చెమ్మట న్గాఱుచుండె
కటికి తానేల పదములు కందిపోయె
వేణిభారము విరజారి వీడు నేమొ
బిందె నొకమాఱు దింపుమా సుందరాంగి.

గున్నగోరంటతోఁటలో వన్నెమీఱ
తోడికన్నియలం గూడి యాడుకొనఁగ
వలయు లేఁబ్రాయమందున వనిత యిట్లు
నీరు దోడెడుకర్మంబు నీకుఁ బట్టె!

తమలపాకులు మలఁచినంగమలిపోవు
నీదు సుకుమారహస్తముల్ నీరు తోడి
కాయలను గాచె చూడుమా కాంత, యెట్లు,
వలదు చాలింపు మిఁక చేదవలదు వలదు—

చీరజరియంచు మలినమై చెన్నుదొరఁగె
నుదుటకుంకుమ తిలకంబు చెదరిపోయె,
మంచిముత్యాలహారము సంచలించె
తెగిపడునొ యేమొ భద్రము మగువకాన.

◆ ◆ ◆

పగలు వెన్నెలగాసిన భానుబింబ
మేమి కోపించునో యని యెత్తవొక్కొ?
అసిగి తరగునొ యేమొ నీ యలరుమోము
వంచిదాచితివేలనో మించుబోఁడి!

సొగసు వస్తువుల్ లేవొకొ జగతిలోన?
కాంచి సంతస మందరొ కన్నులార?
ఏల వాల్చితి నీ ముద్దు ఫాలతలము
దృష్టిదోషంబు తగులునో తోయజాక్షి!

మండువేసఁగి వైశాఖమాసమందు
భూసురోత్తములంబిల్చి పూలు పండ్లు
విసనకఱ్ఱలకోడుత నొసఁగి నీవు
కట్టుకొను దెట్టిపుణ్యమో కాంత, చెపుమ.

మగని కొంగున ముడివేయ మనసువడితొ ?
పాలబుగ్గల ముద్దులబాల నెత్తి
ఊయెలల నూపి యుప్పొంగ నుత్సహింతొ ?
మెలఁగఁ గోరెదొ బంగారునేడలందు ?

చెలియ వ్రతకాంక్ష యెట్టిదో చెప్పకీవు
చిలుకరించితి పెదవుల నలఁతినవ్వు
పలుకు బంగారమా ? నీదు భావపేటి
దాచికొను తీయతలఁపులఁ దోఁచుకొనము.

# కాపుకన్నె

తరగిపోవునో యేమొ యీ ధాన్య మనుచు
చేను కావలి కాచెడి చిన్నదాన,
అలుక బూనకు మొక ప్రశ్న మడుగవలఁతు
చులుకుచూపుల తరువాతఁ జూతుగాని ?

పాలుగారెడు లేజొన్న పంటఁగాంచి
భ్రమసి చవిజూడ నరుదెంచు పక్షిగణము
ఱాళ్లచే రువ్వి పోఁద్రోలి రవ్వజేసె
దింత నిర్దయ యేలనే యిగుకుఁబోఁడి–

పుణ్యపాపమ్ము లెఱుఁగని పులుఁగుకన్నె
నోటిముందటిధాన్యంబు నుస్సురనగ
ఇన్నిసాయల నీరీతి నెత్తఁగొట్ట
చేతు లెట్లాడనో నీకు చెప్పవేమొ ?

అందచందముల న్జూచి అరయనైతి
విసపుముద్దవు నీవని నెఱ్ఱికాదె !
వలపుటుంగరమందలి వజ్ర మకట
నిలువునం దీయదే ప్రాణనిచయ మతివ !

## మహాత్ముఁడు

హస్తమునఁ దాల్చి యా అహింసాయుధంబు
శాంతిసంగ్రామనాదము సలిపి సంతె
ధరణి కంపించె సల సభ్యతాజగంబు
సన్నిపాత ప్రలాపముల్ చాల చేసె-

కుక్క లవి యెన్ని మొఱిగిన కుంటువడునె
గంధగజరాజశేఖర గమనసరణి
ఆత్మలాభపరాయణాలాపములను
ఆఱిపోవునె ప్రజలలో అగ్నిదీప్తి.

తుచ్ఛసుఖములకై తల్లి స్వేచ్ఛ విక్ర
యింప సంసిద్ధులై కొందఱేమొ కొన్ని
కూఁతలను గూసినంతనే కోలుపోరు
ప్రజలు కలనైన స్వాతంత్ర్య భవ్యదీక్ష.

ఎండ కన్నెఱుఁగని యిందీవరాక్షులు
కాసెలు బిగియించి కదలినారు
విజ్ఞానజగతిని విహరించు పండితు
లర్పింప నున్నవారాత్మశక్తి
కూలినాలి యొనర్చి కుడుచు పెంబేదలు
నీ గొడ్గుఛాయల నిల్చినారు

శిరిసోడ తులదూగు శ్రీమంతు లెందఱో
త్యాగసంసిద్ధులై తరలినారు
వేణుగోపాలుగానము విన్న గోపి
కలవిధమ్మున మేనులు పులకరింప
అనుగుచెంచిరి ప్రజలు నిన్ననుసరింప
కలఁడు దేవుఁడు మనయందు కలఁడు కలఁడు.

అలుక యెఱుఁగని నీవె నేఁ డలిగితంట
ఎదుకుకొనశక్తి గలవార లెవ్వరింక
సత్య మగు నాగ్రహాగ్నిని సాహసించి
ఆర్పగా శక్య మౌనె అంత్యజునకైన?

పశుబలంబును పూజించి ప్రణుతిసేయు
జడులు తెలియుదు రె ట్లహింసాబలంబు?
నక్క కేగగ శక్యమే నాకభూమి
కటిక గొఱ్ఱా లెఱుంగునే కడుపుతీపి.

పాశ్చాత్యసంస్కృతి ప్రాభవంబున గదా
మనపరిశ్రమ లెల్ల మంటఁగలిసె
పరదేశపాలనభాగ్యంబునన్గదా
మనవిభేదంబులు ఘనములయ్యె
ఆంగ్లేయరాజ్యపు టండను మనవారు
పౌరుషం బెఱుగని పందలైరి

పారతంత్ర్యముమెక్కి భారతీయులు నేఁడు
కూటికి గతిలేక కుములుచుంద్రు
ఇంక నెన్నాళ్ళు భరియింతు మీ విదేశ
పాలనము బుద్ధివచ్చెను చాలునింక
చెంపలను గొట్టుకొని చెంతఁ జేరినాము
నీదు సారధ్యసౌభాగ్య మాదరింప.

సత్యమూర్తి మహాత్ముఁడౌ సంయమీంద్రు
చెఱలలో సిల్లుగులన్నట్లు చేష్టితంబు
అనుభవింపకపోదురే, అనఘు, నీదు
ఘోరశాపము నన్వారు కూలిపోరె.

విస్మరింపగ లేదు వీరబొబ్బిలియందు
పాఱిన నెత్తుటిధార లేము
మఱవంగఁ బరమానె మఱుజన్మ మందైన
పంజాబుహత్యలు పట్టపగలు
కండలు గదలియు మండదే హృదయంబు
తలఁచిన లాఠీల దండనంబు
సహియింపనేర్తుమే స్మరియింప నొకమాఱు
చెఱలలో వర్తించు తెరఁగులెల్ల

తెల్లవారల రాజ్యంబు తెల్లవాఱు
దనుక ఆఁకలి దప్పుల దలఁపలేము

ఎవ్వ రేమైన నందురి నీ కేమికొంత
ముందు నిలఁబడి నడిపింపు మో మహాత్మ.

చీరసింగారములు జేసి సిగ్గు వీడి
గొప్ప పదవులయుంచున గుల్కి కూయు
పురుషభామామణుల యింటితరుణులందు
ఖద్దరెక్కినభార్య లొక్కరును లేరె ?

# బీదకాపు

ఆఱిపోయినచెఱువు కన్నార జూచి
పండువాఱిన తన పొల మెండబారె
దీర్ఘనిశ్వాస మొక్కటి తీసి నిల్చి
నడువఁజాలని యొకకాఁపు పడుచువాఁడు.

నీరు ద్రావగ నొకలేఁగ నోరు దెఱచి
చెఱువుకడ కేగ జలములు దొరక కపుడు
బీదచూపుల తను జూడ బేల యగుచు
కన్నులను నీరు గార్చె నా కాఁపుబిడ్డ.

"ఎన్నిమారులు వేఁడిన నీశ్వరునకు
కరుణ మా మీఁద నిసుమంత కలుగ దయ్యె
భావిజీవనఫల మిట్లు భగ్న మయ్యె
కంచెయే చేను మేసిన కలదె దిక్కు!

పురుగు దిన నాశ మయ్యెను పూర్వసస్య
మట్టులను సాచు ఫలములు నంద వయ్యె
ఎవరు విందురు మా మొఱ లీ జగాన
నారు వోసిన వాఁ డేల నీరు విడఁడు?

ఇప్పుడో యప్పుడో కోఁత కీ పొలాలు
అందు నను నాశలన్నియు నంతరించె

ఈశ్వరుఁడుగూడ పేదల నీసడింప
ద్రోచు వా రెవ్వ రింక నీ భువిని వారి ? ?"

అనుచు నేమేమొ తలపోసి యడలుచుండ
వ్రాలె నొకరెండు పిట్ట లా వరులమీఁద
కలుగ దొకగింజయైన యాఁకలిని దీర్ప
కటికదారిద్ర్యమింకను కలదె వేరు ?

బిట్టు విలపింప దలఁచి యా బీదకాఁపు
విఫలుఁడయ్యెను శోకంబు వెలికి రాక
కుమిలిపోవుచు తనలోన కుంది కుంది
ఎట్టు లింటికి పోయెనో యెఱుఁగడయ్యె.

కాలు పెట్టినయంతనే కడపలోన
పరుగు పరుగున జనుదెంచి బాల యొర్తు
అన్నమును పెట్ట లేదన అమ్మ నేఁడు
ప్రకృతిపురుషుఁడు తను జూచి పరిహాసింప.

మసిపాత గట్టిన మాణిక్యమో యన
మెఱుగులు జిమ్ము నెన్నొసటితోడ
సిగ్గు పోవునో యంచు చినిగిపోయినచీర
చక్కగా సవరించు శ్రద్ధతోడ

ఆఁకట నల్లాడు ననుగుఁ గూఁతురునోట
చేపని పాలిండ్లఁజేరగుత్తోడ
దీనస్వరూపిణియై తిరిపెము నెత్తుచు
కడపల దండాలు నిడుచు నంత

అన్నమో రామచంద్రా యటంచు పల్కు
ద్వారవేదిక నిలుచున్న తరుణి నోర్తు
చూచి బిచ్చంబు నిడనైన నోచ లేక
కూలఁబడె నల్లి యాతఁడు తాళలేక.

# తోడికోడలు

పదియు నాఱేండ్లు నిండని పడుచుఁదనపు
కలిమి మోమున గల యొక్క కరుణమూర్తి
రెండుకన్నుల నశ్రువు ల్నిండుకొనఁగ
ఒంటిగా మల్లెశాలలో నొదిగియుండ—

కుదురు సవరించి కవ్వము పదిలపఱచి
వెన్నదీసెడు యొక ప్రౌఢ వన్నెలాఁడి
కొంగు చేబూని గారాపుకొమరుఁడపుడు
ప్రేమ ముప్పొంగ కింగుల మారాము సేయ—

రార, వరహాలమూట, బంగారుకొండ,
గోరుముద్దలు తినిపింతు రార తండ్రి
అనుచు చిన్నారి కొడుకుతో నచటికరిగి
సుందరీ శోకరూపంబుఁ జూచి నిల్చి—

మధురభావంబు లెల్లను మఱచి యంత
"ఏమి చేయుదు నయ్యయో యీమెకొఱకు
ఱాతిగుండెలు గలుగు నా నీతిహీను
డెన్నివాగ్దానములో చేసి యిట్లొనర్చె!

ధనము కాసించి యాతఁ డీ తరుణి నిపుడు
పరిణయం బాడకయె యేడి యరిగె వేఱు

కాంతతో జేయుచున్నాఁడు కాఁపురంబు
లోకు లరయంగ నిజముగ కాకులె కద.

ఈమె యపవిత్రి యని సంఘ మీసడింప
పీటవెట్టుదు నెవరికి పెండ్లియాడ
అడవిఁ గలియునో యేమొ యీ యబల సొగసు
జెప్పరే సీతసౌభాగ్య మిర్వైజనులు.

సాధ్వి యీ కన్య పెండ్లాడ సాహసింప
కామసంతృప్తిని జన్మైనప్రేమ యనెడు
భావముల కంజలించు నీ భారతీయ
యువకు లందున నౌదార్య ముండునొక్కొ ?

చెలిమికత్తియ సుమతికి చెల్లె లౌట
సోదరిగఁ జూచుకొందు నీ సుదతి నేను
పిలువ నక్కయ్య యని యీమె ప్రీతితోడ
కొసరి పిలిపించుకొన నాకుఁ గోర్కె కలుగు.

ఆడు తోఁబుట్టువులు లేనియట్టి కొఱత
నుంత కలుగదు నా కీమె చెంత నుండ
ఒప్పులొలికెడు నీ బాల నొక్క యింటి
దాని జేసెడుభాగ్యంబు దాల్తునొక్కొ ?

గౌరిఁ బూజించి మంగళవారవేళ
పెద్దముత్తైదులకు మ్రొక్కి ప్రియులఁ గూడి
ఇరుగుపొరుగున బాలిక ల్మురియుచుండ
చిన్నవోవును యీ కన్నె చెన్ను దొరఁగి.

మధురవర్తనుఁడైన నా మఱదిమీఁద
నిలిపెనఁట యీమె పిననాఁడె నెమ్మనంబు
తండ్రి సమకట్టు పెండ్లియు తప్పిపోవ
రెంటికిం జెడిపోయిన రేవణయ్యె.

అనుచుఁ దలపోయు చల్లన అరుగుదెంచి
కౌఁగిటను జేర్చి యా బాల కనులు దుడిచి
ఎంత సేపయ్యె చెల్లెలా, యిటకు వచ్చి
పిలువవైతివె యెందుకే బేలతనము ?

◆ ◆ ◆

"పెరిగి నా మొక్కటే యింటి బిడ్డలట్లు
అరమరలు సుంతయునుగూడ నెఱుగ మెపుడు
నీ వెఱుఁగని విషయాలు నెలఁత, నాకు
లేవు నీ తోడు నిజముగా లేవు సుమ్ము !

పెద్ద లేమందురో యని భీతి నొంది
దలను వంచను మాలిన మా వలపుముందు

పెండ్లియాడుదు భవ్య పూ ప్రేమకొఱఁకు
సాధ్వి, నీ విచ్చు దీవన ల్చాలు మాకు.

పచ్చనాకును చేఁబూని బాస చేతు
విడువ నీమెను నే నెట్టి వేళయందు
కలుగ దిసుమంతకొఱఁత యీ కలికి కీవు
తోడికోడలవై తోడునీడ వగుట."

"స్వామి భవదీయ పదపద్మ సన్నిధాన
జీవములఁ బాసిపోదు నిశ్చింతతోడ
కాని నా కన్నకొడుకుల కన్నులార
అరయ కోకమాఱు లేదు నా కాత్మశాంతి-

మూఁడుదినములనుండియు ముద్దుసుతులు
నిలిచియున్నారు నా మనఃఫలకమందు
సేవగాన్రమాన ఆనాఁటిదేవదాసు
తీయమాటలె చెవుల ప్రతిధ్వనించు."

అరుగుదెంచిరి ఆనాఁడు అనుఁగుసుతులు
అమ్మచరణాలు కన్నుల కద్దుకొనగ
పిల్లవాఁడయి శిర ముంచె తల్లియొడిని
ముప్పదాఱేండ్ల కడగొట్టు ముద్దుకొడుకు.

బరువు లెక్కిన హృదయాల పలుకలేక
మాతృదేవత కెదురుగా పుత్రులెల్ల
నిలిచియుండిన ఆ సాధ్వి పిలిచి యొకని
ప్రాణనాథు నాహ్వానింపఁ బంపె నంత-

అరుగుదెంచిన మహనీంద్రు నంకభాగ
మందు శిర ముంచి యాతని హస్తయుగళి

మోమునం జేర్చి కన్నులు మూసికొనియె
తిరిగి యెన్నఁడు వాసిని తెఱవ ననుచు.

పసుపుపాదాలు కుంకుమ వదనమందు
నొప్పగా నేలిఖన్దను ఉడుపు దాల్చి
పూలచేఁ గప్పఁబడియున్న పొలఁతినేను
వింత తేజంబుతో డుత వెలుఁగుచుండ—

చేతులారగఁ బెంచిన చిన్నమనుమ
రాలు ఆ సాధ్వినిం జూచి అమ్మ నన్ను
ఏల పిలుఁనవు కోపమే యెందు కనిన
చూచువారల హృదయాలు చూర్ణ మయ్యె.



చితిని జేరిచి యామెను చేర్చియందు
అగ్ని కాహుతిగాఁ జేసి యచట నిల్వ
నేర కా దేవదాసుఁడు జాలిపడుచు
గోలుగోలున నేడ్చెను కూఁతురట్లు.

మండుచుండిన చితి నొక్కమాఱుచూచి
ఆ మహాదేవదేశాయి నందుఁ జూచి
గోలుగోలున నేడ్చెడు కొడుకుఁ జూచి
అనదలైయున్న యాప్తుల నరసి యరసి.

పిడుగు లొకవేయి నెత్తినఁ బడిననైన
సహజ గాంభీర్యభావము సడలనీక
చెక్కు చెదరని బాపు నిశ్చేష్టుఁ డయ్యె
కనులరెంటను బాష్పము ల్గ్రమ్మె నపుడు—

## జాత

కడిపెఁడుః కొడుకులు గల యూ
పడఁతులు మును చేసికొన్న భాగ్యం బేమో
కొడుకులు లే రని మనమున
కడు వగచెడు నా యకార్యకరణం బేమో ?

ప్రాణనాయకు నంకాన భాగ్యరాశి
మురిసి కన్నుల ప్రేమంబు గురిసినట్లు
కలను గంటిని అక్కటా కల్ల యౌనె
లేబర మటంటు బిడ్డలు లేనిబ్రతుకు.

కడుపుతీపి యెఱుంగని కాంత జన్మ
మేలకో తోడివారల హీననైతి
ప్రియుఁడు నా వంకఁ జూపెడు ప్రేమ కింత
ఫలము నేరని వట్టి నిర్భాగ్యురాల !

అమ్మ అమ్మా యటంచు మా యక్కకొడుకు
తలఁచి తనతల్లిగా నన్ను పిలిచినపుడు
పులకరించును నెమ్మేను పొటమరించి
మాతృపీఠం బటన్న సామాన్య మౌనె ?

తలఁచు చీ రీతి ప్రియంపుతరుణి యొర్తు
స్నాన మొనరించి చన్నీట జాఱు కురులు

ఆర్ద్రవసనాలతోడ దేవ్యాలయంబు
కరిగి బంధించి సుకుమార కరయుగంబు.

సుగుణములప్రోవు శూరుఁ డౌ సుతుని నీయఁ
గోరుచుంటిని వరమును కొంగు జాచి
తల్లి సంతానభాగ్యమే తనరదేని
సత్యము వచింతు వలదు సంసారసుఖము.

ఈయవా దేవి, భిక్ష నా కిప్పు డనుచు
పాదపద్మంబులకు భక్తి ప్రణతి జేసి
ఆణిముత్యాలతో వాని నందగించి
మౌనము న్బూన కన్నులు మాటలాడె.

నెలదప్పె కొన్ని నాళ్ళకు
నెల పొడిచినయట్లు నీరజాక్షికి నంతఁ
తొలి చూ లొదవిన నలరుచు
నిలుపగరానట్లు పొంగె నెమ్మనమందుఁ.

అరుణుఁ డపరంజి కరముల నప్పుడప్పుడె
కెంపుకొన్కల్లు జగతికి పంపి పంపి
అలసి విశ్రాంతి గైకొన నరుగుచుండు
ఆత్మ నలరించు నాఁటి సాయాహ్నవేళ.

అందాల నొసలిపై చిందులాడెడు కురుల్
చిక్కులు విడదీసి చేర్చి దువ్వి
పాలిచ్చి జోకొట్టి బాలభాగ్యంబును
పొత్తిళ్లలో నిద్రఁ బోవఁజేసి
పసపుకాంతుల నీను పడుచు నెమ్మోముపై
కుంకుమతిలకంబు కుదురుపఱచి
పట్టంచుచీరపై బంగరుపూవుల
నీలాంశుకంబును నీటుగుల్క
ఐదువతనంబు రూపొందు నబల యనగ
తఱిపిబఱ్ఱెల పాలును దాక్షపండ్లు
తీసికొని పోవుచుండగ దేవికడకు
వచ్చిబాలెంతరాలు ఆ పరమసాధ్వి.

చిక్కి శల్యావశిష్టుఁడై చివికియున్న
తరుణుఁడౌ రాకుమారుని దారిలోన
చూచి కడు ఖిన్నయై యేమి శోచకపుడు
బొటబొట నాల్గి కన్నీటిబొట్లు రెండు-

ఆలయమువంక ముందున కడుగువెట్ట
నేర కే గతి నింటిలో నిముసమేని
విడువఁజాలని బాలుని విస్మరించి
మఱచె సకలంబు నా సాధ్వి మధురహృదయ.

చెట్టు లొసఁగెడునీడలో జీవ మొకటె
మిగిలి స్మృతి లేక పడియున్న మేదినీశు
వంక చెయి జాచి పెదవుల పాలబొట్లు
ఒక్క టొక్కటిగా రాల్చి యుపచరించె.

అమృతహస్తాల సేవించు నవసరాన
మరల జన్మము నెత్తినమాడ్కి నతఁడు
కన్ను లల్లన విప్పి యా కాంత నరసి
క్షీణకంఠాన నిట్లనె శిరము నెత్తి.

"జన్మ మెత్తితి తల్లిని జంపుకొఱకు
మందభాగ్యులు నేర్తురే మాతృదేవి
స్తన్యసుధ గ్రోలు భాగ్యంబు, జనని, యిలను
అధముఁడగు నన్ను నీ వెట్టు లాదరింతొ ?

ప్రతిఫలాపేక్ష యావంత మతిని లేదు
ప్రాణముల నిట్లు నేఁడు గాపాడినావు—
ఎఱిఁగితి స్నేహమవృత్త మే నిపుడు తల్లి,
చేయువాఁడను మానవసేవ యింక.

తల్లి లే నట్టివారికి తల్లి వైన
నీదు చేతుల చలువయె నీడ గాగ
నా కుటుంబమె యా నింక లోకమెల్ల.

కలుగునో లేదో మఱుజన్మ కలిగెనేని
పొందమంగోరుదు తల్లి నీ కడుపునందు
మోక్షమార్గంబు దెలియక మూఢవశత
నున్న నను జ్ఞానదోలిక నూపినావు.

ఎట్లు దీర్తునో నీ ఋణం బే నెఱుంగ
అందుకొను మమ్మ పాదాభివందనంబు
సేవ యింక చేతు మానవ శ్రేయమునకు
మాత నా కింక ప్రేమయే మతము సుమ్మ.

కులము, పొలిమేర, మత మను గోల బడక
దీనసేవకు నాశీర్వదించి యింక
ఆజ్ఞ యొసంగుము మా తల్లి అమ్మ యనుచు
పిలున నొకమాఱు నిన్ను నే ప్రేమ మీఱ."

# మూఁగబిడ్డ

ఇందుబింబపు టందము మందలించు
ఎనిమిదేడులు నిండని యనుఁగుసుతుఁడు
తూఁగుటుయ్యాల శయనించి యూఁగుచుండ
రత్నదీపంబు బోలిన రమణి యోర్తు-

అతివ దేహాని కద్దిన యట్లు తోఁచు
పోఁకవన్నియ ఖద్దరు కోక గట్టి
పాలు చేపగ మలిచూలు బాల నప్పుడు
తొట్టియను దీసి యిడుకొనె తొడలమీఁద.

జామచెట్టుల చల్లని చాయలందు
చెల్లెలికి ప్రేమ పాలిచ్చు తల్లిఁ జూచి
ఊఁగఁజాలక వెంటనే యేగి తనదు
కరయుగమ్మున నామెను కౌఁగలించె.

ముద్దులను మూటగట్టు నా మూఁగబిడ్డ
లేతచెక్కిళ్ళ దాఁగిలిమూఁత లాడు
సొగసుగుంటల ముద్దాడె సుందరాంగి
తెప్ప వాల్పక కన్నుల నప్పగించి.

కోమలాంగికి కలిగిన కొఱత యేమొ
అప్రియత్నముగా రాలె నశ్రుకణము

లేమి తలఁచిరొ బాలకుఁ డామె కనులు
చీరచెఱఁగునఁ దుడుచుచు చిన్నవోయె.

మూడుమాసాల తర్వాత మొదటిసారి
ఆలుబిడ్డల కెట్టులో ఆజ్ఞ దొరికె
కలసి మాటాడ వచ్చిరి గాన వారు
సత్వర మ్మాతనిం జూడ జైలుకడకు.

ముట్టితే మాసిపోయెడు మోహనాతి
మోహనంబైన పుత్రుని ముద్దుతనువు
కౌఁగలింపగ జనకుండు కరము సాచి
ముద్దు లాడెడు నా సుముహూర్తమందు-

మూఁగతన మద్భుతంబుగ నేగె నెటకొ
తండ్రి యని పిల్చె గారాబుతనయుఁ డపుడ
పొంకమై మెత్తనై యొప్పు నంకసీమ
మురిసె జనకుండు శిరమును మూర్కొనంగ.

ఆలుమగ లొండొరులఁ జూచి రశ్రుపూర్ణ
నేత్రముల హర్షవశ మైన నెమ్మనంబు
లొక్కపెట్టున నుప్పొంగె; ఓర్వలేక
కాలపరిమితి గడచిన గంట మ్రోఁగె.

# అనార్కలి

వలపు పన్నీటి కొలఁకున జలక మాడి
దోరదానిమ్మగింజల నారగించి
మోవి మోవిని జేర్చుచు ముద్దులాడు
కొదమ రాయంచ దంపతు ల్కులుకుచుండ-

జిలుగు వెలిపట్టు జరియంచు చీర దాల్చి
కురులు సవరించి కొప్పున విరులు దురిమి
ఆభరణ భూషితాంగియై అద్దమందు
తనదు మోమును వీక్షించి తరుణి నాఁడు-

పొద్దు గ్రుంకెడు సమయాన పూలతోఁట
కేగి యల్లన విహరించి యింపులొలుకు
విరుల కొన్నింటి గ్రహియించి వేడ్కతోడ
అల్లె చిత్రముగా నొక్క యలరుదండ.

వలపుతలఁపులు మనమును కలఁచివైవ
ప్రాణనాయకు దివ్యరూపంబు కనుల
యెదుట సాక్షాత్కరింప నా యెమ్మెలాడి
యేమియును దోఁచ కట్టులే యెసఁగునపుడు-

పున్నమవెన్నెల ల్ పూఁబోడి నిద్దంపు
చెక్కిళ్ళ చిక్కు తా చికురపంక్తి

వేణితో స్నేహాంబు విసిగి నేలను రాలు
పరిమళయుక్త ప్రసూనరాజి
భావపరిపూర్ణ మౌ పడంతి యెడందపై
అటు నిటు పరుగెత్తు హారసమితి
జగదేకసౌందర్య సంఫుల్ల వదనార
విందాన దోచు విచారముద్ర
తోటలో చెట్ల చాటున తొంగితొంగి
చూచి ఆపోక మఱి చూచి ఆచలేక
ముందు కడు గిడి యాతఁ డమ్ముదిత యింత
లేసి కన్నులు చేతుల న్మూసి నిల్చ-

ఎవ్వరో చెప్పు మన్న నయ్యింతి యతని
హస్తయుగళంబు తనచేత నదిమి పోల్చి
నాదుప్రాణంబె యని కండ్ల నల్లి తెలివ
ప్రణయవారధి నీఁదె నాపడుచుజంట.

పెండ్లిపందిలిఁబోలు నా పండ్లచెట్ల
నీడ నాయమ యేమేమొ యాడు చతని
కంఠమున హారమును వైచి కౌఁగలించు
విధికి కన్నులు కుట్టు నావేళయందు-

పుడమి కంపించునట్టుల నడుగు లిడుచు
ధరణిధవుఁ డెట్టులో యట కరుగుదెంచి

పండ్లు పటపట గొఱుకుచు కండ్ల నిప్పు
లురల వచియించె నిట్టులు నుఱుముచోలె-

కడుపు చెఱుపంగఁ బుట్టిన కొడుక వౌర!
కులము తక్కువ కులటతో కులుకు వార్త
లెవరు విన్నను నవ్వరే? యెంత సిగ్గు
అనుచు నాయమ చెఱ నుంప నానతీయ-

వంచియుండిన శిరమును వంచినట్లె
నిలిపె నా బాల కన్నుల నీరు గాఱ
దీర్ఘ నిశ్వాసముం బుచ్చి దిటవు పూని
జనకుతో వచియించెను తనయుఁ డిట్లు-

పరువు గల యింటఁ బుట్టుట పాప మేమొ
వలచి వలపించు చెలి పొందు కలుగదయ్యొ
ఈవు మెడఁ గట్టు తరుణి నా కేల నింక
ఆభిజాత్యపు పాపమే యనుభవింతు!

చెఱను బెట్టిన నేమాయె చెలిని నీవు
హృదయములు దూర మొనరింప నోపుదొకొ-
జాతి తక్కువ యైనచో నీతి కేమి
కులము గలిగిన చాలునా గుణముల వలదా?

అస్మదీయ హృదబ్జాన నధివసించు
లక్ష్మియై విలసిల్లు నీ రమణి ధ్రువము
ఆమె హృత్పద్మపీఠి నే నాశ్రయింతు
ఎట్లు విడఁదీతువో చూతు నింక మస్మ.

ఘనులు కాఁబోలు జగతిలో ధనికు లెల్ల
కులము తక్కువ పేదలే కుమతు లకట !
ఓ వెలందుల పొందెప్డు రోఁత కాదు
పేదలను పెండ్లియాడుటే పెద్దతప్పు !

క్రూరమైన సమాజంబు కూలిపోదా ?
పాడు రాజ్యంబు నా కేల ప్రణయమూర్తి
సేవ లేకున్న నా కిదే సెల వోసంగు
మనుచు వెన్కకు దిరుగక యరిగె నతఁడు.

తల మాయ నీయక వలువ మాయగనీని
శ్రద్ధ యదెల్లను సమసిపోయె
పరువంపు గరువంబు ప్రణయపరిసంగము
లడవిని బూచిన యలరు లయ్యె
సంగీత సాహిత్య సరస సంపద లెల్ల
అక్కఱకు రాని యాస్తులైరి
సుందరహృదయాన సుకుమారభావముల్
పరమశత్రువువోలె బాధపెట్టె

అతివ కాకలి దప్పాలు అల్ప మయ్యె
కనులు గుంటలు వడి మోము కళదొరంగె
చిక్కె దేహము కురులును చిక్కవడియె
భామ నెఱజవ్వనము భోగభాగ్య మయ్యె.

# వీరపత్ని

విభుని రమణీయ మంగళ విగ్రహంబు
అద్దమునఁబోలె కన్నుల నాడుచుండె
మనసు నెమ్మోము తోడుత మత్సరించి
నిలువనోపక ప్రాణేశు నెలవు కేగ.

"పన్నీరు చిలికించి ప్రాణేశు నెమ్మోము
సిరిని సేవించెడి మురిప మెపుడొ
వీర్య శౌర్యంబుల విడిదియై విలసిల్లు
పురుషాకృతిని జూచి పొంగు టెపుడొ
పెదవు లల్లన విప్పి ప్రియ మార నవ్విన
కన్నులు చల్లగాఁ గాంచు టెపుడొ
కవన కల్యాణివే కల్కి నీ వని పల్క
స్నేహరసంబును చేదు టెపుడొ
మూఁడుమూర్తుల నచ్చు మా మొగలు రాజ
శేఖరుల జ్ఞప్తిఁ దెచ్చెడు శ్రీముఖంబు
ప్రాణ ముండగ హృదయంపు బరువు దీఱ
అరసి మాటాడు సౌభాగ్య మమర దయ్యె.

మృత్యుదేవతకుం గూర్చు ముద్దుచెల్లి
చేతిలోఁ జిక్కి కృశియించి చివికిపోయి

కొట్టుకొనుచుండె వేగాన గుండె లిపుడు
నోచుకొన నైతి నాథునిఁ జూచుకొనగ.

వెఱ్ఱినై కాక నే నిట్లు విభ్రమింతు
అరయ స్వాతంత్ర్యయోధు లౌ నార్యవరులు
కలవరం బొందుదురె యెప్డు వలపుఁగూర్చి
ప్రేయసియె తప్ప ఇం కెందు ప్రేమ లేదొ?

ఖిన్నయై శోక మొందెడు కన్నతల్లి
ఆర్తియే తప్ప నన్యంబు నరయలేక
దేశస్వాతంత్ర్య వర్ధన దీక్ష దాల్చు
ప్రాణవిభుఁగూర్చి నే నేల పరితపింప?

త్యాగమూర్తిని ప్రేమించు తరుణి కెపుడు
విరహమే కోరి గ్రహియించు వరము కాన
సహన మొనరింతు నీ వ్యథ సంతసించి
నేను తల్లిని సేవింప నేరనైతి.

దేశ స్వాతంత్ర్యదాహము దీర్చికొనక
కలుగునే ఆఁకలియు దప్పి కలలనైన
మొండులై బండ లౌ శిఖండులకుతప్ప
పురుషసింహుని నా విభు నొబ్బెలునరుకు.

చక్కదనమును భాగ్యంబు జవ్వనంబు
కలుగు స్వాతంత్ర్యదూతి యా కమల నాడు
తనదు భర్తను విధ్యుక్తధర్మ మెపుడు
వీడవల దని కేల్మోడ్చి వేడుకొనదె?

ప్రాణములు గూడఁ బాసె నా పరమసాధ్వి
పంజరంబున కృషియించు పక్షిపగిది
చిన్నిబిడ్డను ప్రాణేశు చేతఁ బెట్టి
దేశజనులకు దివ్యసందేశ మొసఁగి.

హృదయములు నేళవింపగ నొప్పుగాక
ఒక్కచోటనె దేహంబు లుండ నేల?
అరిగెదనుగాక యింక నే నమరపురికి
హృదయవిభురాక నచ్చట నెదురుచూడ."



పండువాఱిన తాంబూల పత్రిభంగి
పాలిపోయిన చెక్కిళ్ళ నీలవేణి
దూరమున నున్నదాసిని చేరఁబిలిచి
అత్తరువుపెట్టె తెమ్మని యానతిచ్చె.

భవ్యమై యొప్పు తనప్రేమ పరిమళించు
రమణి దెచ్చిన సుందర రజతపేటి

అందుకొని భక్తి కన్నుల నద్దుకొనుచు
ప్రాణనాథుని కూరిమి ప్రస్తుతించి-

క్షీణస్వరమున నేమియో చెప్పఁబోయి
పలుకఁగా లేక యాయాసపడుచు నంత
శాశ్వతంబుగ నిద్రించె సాధ్వియిన్న
పొలుపుదొరఁగిన చక్కని పూవుపోలె.

# అర్ధాంగి

చిన్నారి పొన్నారి చిట్టిచేతుల మేలి
గోరంట రసమును కుదురుపఱచి
బంగరు రుచు లీను మంగళసూత్రము
భవ్యానురాగమ్ము ప్రతిఫలింప
ఇరుగుచెల్లెలిఁ గూడి పొరుగునక్కయ్యతో
తీయనిరాగాలు దీసి తీసి
జోలపాటలు పాడి సోదరీపుత్రికఁ
కదలు నుయ్యేలలోన నిదురబుచ్చి
మొల్లపాదుల నీర్వోసి మోహనాంగి
బొమ్మలకు మధ్య కుంకుమబొట్టు పెట్టి
కాన నడయాడు సర్వమంగళవిధాన
తిరుగు చీ రీతి తలపోసె పెరటిలోన–

పచ్చపచ్చగ ప్రియుఁ గూడి ముచ్చటాడి
కొన్ని నెల లాయె నింక నా వన్నెకాఁడు
తిరిగివచ్చునొ రాఁడొకో తెలియరాదు
ఇతరులకు నెట్లు చెప్పుదు నీవిధంబు.

"స్వేచ్ఛ స్వాతంత్ర్య దేశాన సంచరించు
కలిమి పూఁబోఁడి ముద్దుపుత్రులకు గాక

కూడు గుడ్డకు లేక అల్లాడుచుండు
బానిసల కేల ప్రేయసీ ప్రణయకేళి!

కమ్మకౌఁగిట నను నొత్తి కాంతుఁ డిట్లు
వీడుకోనియెడు సమయాన నాడినట్టి
ధీరవచనాలు చెవుల ప్రతిధ్వనించి
కన్నులకుఁ గట్టు నాతని కమ్రమూర్తి.

ప్రాజ్య వసుంధరాభారమ్ము వహియించి
రాణించె నాఁడు రుద్రమ్మదేవి
పగరకు వెన్నిచ్చుమగనికి నొకసాధ్వి
పాఁడి కాదని చెప్పి పంపె ననికి
కత్తిని ఝుళిపించి కదనాంగణంబున
విక్రమింపదె యొక్క వీరపత్ని
చెడుత్రోవలను బోవు చిన్నతమ్ముని బిల్చి
ఆడుబిడ్డ యొకర్తు ఆజ్ఞ నుంచె
పురుషులకుఁ దీసిపోవక తరుణు లెపుడు
దేశసౌభాగ్యవీథులఁ దిరిగినారు
ప్రాణనాయకు నాశీర్బలంబు కలుగ
ఏల సందేహముచు చెంద నింక నాకు ?

నన్ను నర్ధాంగిగా నాతఁ డెన్నుకొనుట
నేను సహధర్మ మిప్పుడు పూనవలయు"

అనుచు నా బాల తలపోయు నవసరాన
కొడుకు ముంగురులఁ దిద్దు పడఁతి యోర్తు-

పసిఁడిబలపంబుతో వెండిపలకమీఁద
ముత్తియంబుల సొంపుల నెత్తిపొడుచు
ముద్దు లొలికెడు నక్షరాల్ దిద్దుకొనగ
రార నను గన్నతండ్రి వే రార యనుచు-

అడుగులో నడ్గు వైచుచు నరుగుదెంచి
అనుఁగుచెల్లెలిఁ దిలకించి యనియె నిట్లు
భోజనము చేయ రావేమొ ప్రొద్దువోయె
కొడుకు నీ పొత్తునను గాని కుడువఁడమ్మ!

అనిన చిఱునవ్వుతో నామె యక్కవంక
ప్రేమదృక్కుల వీక్షించి పెదవి విప్ప
తోడఁబుట్టువు లేమొ మాటాడుకొనుచు
పొట్లపందిలి పొంతకుఁ బోయి రపుడు.

# మోసము

పుట్టనైతిని నే నొక పిట్ట నగుచు
ఎట్టి బంధంబులును లేక యిచ్ఛవచ్చు
రీతి కాలంబు గడపుదు రేలు పవలు
ఆట పాటల నా కేరు సాటి లేక.

వలదు ఈ పెండ్లి నా కంచు పలుకు టెట్లు
ఎన్ని విధముల యత్నించి యేమి ఫలము
చంద్రసుకుమార మా యోగి చక్కదనపు
మధురస్మృతి అయ్యయో యేల మఱపురాదు !

ఉఱుము విని సంభ్రమించు మయూరకాంత
సూర్యు వీక్షించి కమలమ్ము శోభఁ జెందు
చంద్రునిం జూచి కలువయు శాంతిఁ జెందు
సఖుని స్మరియించి నేనును సంతసింతు.

పిన్నతనమునుండియు ప్రేమమీఱ
కంటిలో పాపపోలిక కాచుచుండు
తల్లిదండ్రుల హృదయాలు తల్లడిల్ల
ఏల పరిణయంబు ఇంక నాదేటి బ్రతుకు !

అగ్నిసాక్షిగ పెండ్లాడునతఁడె సుమ్మి
స్వామి దైవంబు భారత భామ కంట

హృదయ మింకొకవ్యక్తిపై నుంచుకొనుచు
మగని తిలకించు టెట్లొకో మొగము నెత్తి.

ఆత్మచోరునికై వట్టి యాస లేల ?
రాజనగరాన పట్టపురాణి నగుచు
సంఘబంధాలతోడ నే చచ్చిపోదు
పోవ రెందఱు ఇట్లు లీ భువిని ముందు?

చిలుక గోరువంకలం బోలు చెలుల జంట
పూర్వజన్మాన నెడఁబాపఁబోలు నేను
వరుని వరియించుటే ఘోరపాప మయ్యె
అన్నిపాపాలు స్త్రీలవే యౌనొ యేమొ ?

బేలనై మన్ననము వీడ వేలనోయి
అక్కటా నాకె స్వాతంత్ర్య మమరెనేని
అర్పణము సేయకుందునే ఆత్మసుమము
దాసినై ధర్మబంధాలఁ దగులుకొంటి.

ఆప్తుల బంధులముందు నతనితో నే నెట్లు
సాప్తపదీనంబు జరుపుదాన
అగ్నిసాక్షిగ నీవె యాత్మనాథుఁడ వంచు
శపథంబు నేరీతి సలుపుదాన

ప్రియమార నా భర్త బిగియారు కౌఁగిటఁ
జేర్చిన నేరీతి నోర్చుదాన
అర్థాంగి ర మ్మంచు ననురాగమునఁ బిల్వ
యేమని యుత్తరం బిచ్చుదాన
ఎందులకు వచ్చె నచటి కా సుందరుండు
ఏల నాయోగి గానంబు నాలకింప
మనసువడి పిల్చి వీక్షించి మరులుగొంటి
జనకునకు నీ రహస్యాలు వినుచు టెట్లు?

శోభనమునాఁటిరాత్రి యా సుందరాంగి
ముసుగు మెల్లన సడలించి భూపసుతుఁడు
మోహమున నక్కునం జేర్చి మోము జూడ
కాంతమోమున నిసుమంత కాంతి లేదు.

దినము నొక క్రొత్త కానుక దెచ్చియిచ్చి
మిగుల ననురక్తుఁడై కూర్మిమగనిమీఁద
ఎంత కర్కశహృదయయో యింతి యోని
నిలుప కెట్టుల దాచును నెమ్మనంబు.

ప్రాణపదముగ ప్రేమించు భర్త నామె
తిరిగి ప్రేమింప మిగుల యత్నించుచుండి
వెలికిఁ జూపుచునుండును వలపుకలిమి.

ప్రాణేశు కంఠాన ప్రసవమాలిక వైచి
వాడనీయకు మంచు వేడుకొనను
వెన్నెల రేలలో విభునితో నాబాల
ఆనందయాత్రల నాచరించు
అవనీశుఁ డిసుమంత యాలస్యమొనరింప
నిర్దయుండ టంచు నిందసేయు
ప్రియునకు నెదురేగి ప్రేమగీతాలతో
స్వాగతం బని పల్కి సరస నిల్చు
కాని నాథుండు తను వీడి కడప దాఁటి
అవ్వలికిఁ బోయినంతనే యామె కకట
మొదట ప్రేమించు యోగియే యెదుటఁ దోఁచి
ఒక్కపెట్టున హృదయంబు నూపివైచు.

భావచోదిత రమ్య ప్రభాతవేళ
కలికి సంపగిమొగ్గల కమ్మతావి
పవనడోలికలందున పరుగులెత్త
ఇప్పుడే వత్తమని పల్కి యిల్లు వీడి-

వివిధ చిత్రాలంకృత వింత గొలుపు
సుందరం బగు తమ కళామందిరమున
కరిగి యా జోడు భుజముల నొరసికొనుచు
కనియె నా చిత్రశాలను కన్నులార.

అభిమన్యు మఱపించు నా బాలచంద్రుని
　　పడుచుపోంకముఁ జూపు ప్రతిమ యొకటి
ఖడ్గంబు చాలించు గణపతిదేవుని
　　వీరవిహారంపు విగ్రహంబు
మంత్రి తిమ్మరుసుతో మంతనం బొనరించు
　　శ్రీకృష్ణరాయుల చిత్ర మొకటి
బల్లెంబు చేఁబూని మల్లమ్మ తన నాథు
　　నని కేఁ బోవగ నాజ్ఞ నడుగు పటము
వేడిపలుకుల నాథుని వీడుకొలుపు
తిక్కయోధుని భార్యాప్రదీప్తమూర్తి
ఆదిగా గల నెన్నియో యంశములను
అరసి ప్రణమిల్లి ముందున కరిగి మఱియు-

జగతి శాసింపంగ జాలు తిక్కనమంత్రి
　　గంభీరరూపంబు గాంచి మ్రొక్కి-
కవిసార్వభౌముని కనకాభిషేకంబు
　　ప్రతిమకు భక్తితో ప్రణతిజేసి
పల్లకి రాయలు బట్టి యెత్తగ నొప్పు
　　అల్లసానికవీంద్రు కంజలించి
పోతన్న మొదలైన పూర్వకవీంద్రుల
　　చిత్రంబులకు మోల్ల శిరము వంచి

మిగుల నుష్ణాంగి మరియు నిమేసమందు
త్యాగరాయని దివ్యపాదాభివంద
నం బొనర్చెడు సుందరు నాననంబు
అరసి నిల్చిన నీరయ్యె నంబుజాక్షి.

కల్కి మోమున మార్పును గాంచి భర్త
చూచితివె యెప్పుడైన నీసుందరాంగు
ననిన నేమాడవలయునో అరయ లేక
కొంత తడ వట్లె నిల్చుండి కుందరదన—

ఎప్పుడో పాట పాడుచు నేగుదెంచె
మన వివాహంబునకు ముందు మాదు తోట
కనిన నాతని మఱి చూడ నభిలషింతు
వేమొ వచియింపు మని పల్కి మోము జూడ—

విద్యు దాఘాత మొందిన విధము నామె
ఒడలు నా పాదమస్తక మొక్కలిత్త
తనకు స్వాధీనము న్గాక తప్పిపోవ
కొయ్యబాఱెను అట్టులే కొంతసేపు.

చెలియ ప్రత్యుత్తరంబుకై నిలువ కతఁడు
అరిగె తక్షణమే ; ఆమె యరయ దయ్యె

కాన యిట్టనటు దిలకించి కనులు విప్పి
విభుని గానక దిక్కులు వెదకుచుండ—

అద్భుతంబుగ నాయోగి సరసి యచట
చూచు చట్టులె నిలుచుండె చోద్య మొంది
కొంత తడ వేమొ యోచించి కోమలాంగి
ఎట్లు పోల్చినదో కాని యెఱుఁగరాదు—

"చాలు నిఁక నీదు చిత్రాలు చాలు నాథ
ఇన్ని దినముల నుండియు నిట్లు దాచి
నన్ను వేధించితివి నీకు న్యాయమగునె
ఎట్లు శిక్షింపవలయునో యీవె చెప్పు.

కత్తిరించితి యోగివై చిత్ర మీవు
పతివి దేహంబునకె యైతి భర్త వగుచు
మనసు నీయక యిన్నాళ్ళు తనువె యిస్తి
నింతకన్నను శిక్ష నీ కేమి వలయు ?

అన్నెపున్నెంబు లెఱుఁగని యబల నిట్లు
మోస మొనరించి నీ వేమి మూట గట్టి
నాఁడ విఁక నేమి చేతునో చూడు నిన్ను"
అనుచు నాతని కౌగింట నదుముకొనియె.

( ఇందలి కథావృత్తము ముష్షి పేమచంద్రుని
రచనకు స్వేచ్ఛానుసరణము. )

# నీ రా జ న ము

లక్ష్యలక్షణ రూప కల్పనల యందు
ఆంధ్రసారస్వతాన నవ్యంపు రుచులు
ప్రబల చేసెడి తావక ప్రాభవమున
కంకితం బయ్యె నా హృదయంబు సుకవి!

దేశమే నీ వుపాసించు దేవదేవి
అవని యంతయు ప్రేమ మయంబు నీకు
మధుర మధురము తెనుగు నీ మాతృభాష
ధన్యుడవు నీవు నీ పుట్టు ధన్యమయ్యె!

భావకవితా ప్రపంచాన భామినులును
మాతృపీఠమునందు సమ్మాన లగుట
నీవు చూపు నుదాత్త మా నేర్పు గాన
అందుకొను మయ్య మ ప్రీతి వందనంబు.

కళయు సౌందర్య మారాధకంబు నీకు
ప్రకృతి లావణ్యమో నీకు పరమప్రియము
కావ్యఫలముల నాంధ్రుల కాంక్షదీర
కోసి యిత్తువు ప్రేమతో కోవిదేంద్ర.

తెనుఁగునాఁడు నీది; తెనుఁగుబిడ్డవు నీవు
తెనుఁ గటన్న నీకు తీపి మెండు

తెనుఁగుకన్నె జడలఁ దీర్చి మక్కువతోడ
తెనుఁగుతోఁటలందు దిప్పినావు.

అందములైన నామముల నాదరణీయ భవత్కృతుల్ మహా
నందము గూర్చుకున్న నవనీత సుధామయంబులై
సుందర భావచోదిత ప్రసూనసమాన పరీమళంబులై
వందన మాచరింతు నిఁక వాక్కుల కందవుగాన భావముల్.

సూరన సుకవితా సుందరసౌధాన
కావ్యసౌభాగ్యంబు గాంచినావు
శ్రీనాథకవిరాజు శృంగార వనములో
కుసుమాలు దోసిళ్ళ గోసినావు
తిక్కనామాత్యుని తీయమామిడిపండ్ల
మాధుర్యమున మేను మఱచినావు
పోతనార్యుని సుధాపూత కావ్యంబున
ఆవేళ రత్నాల నడిగినావు
అంతియే కాక ఆంధ్రంబునందు నీవు
భావకవి లోకమునకు సంభావ్యుఁడ వయి
త్రోవ జూపుదు కవికుమారులకు నేఁడు
రాయప్రోలు దానిమమిూఁది రామచిల్క!

# సంక్రాంతి

చిగురు చెక్కిళ్ళ ముంగురు ల్చిక్కువడగ
మొల్ల చిఱునవ్వు మోమున మొగ్గదొడుగ
అగరుతిలకంబు బొమ్మల నందగింప
చిలుకపలుకులు పలికెను చిన్నిచెల్లె.

"అన్న, యెక్కడి కేగెదు నన్నుఁ జూడ
సకియ, సంక్రాంతి వచ్చెడు సమయ మయ్యె
క్రొత్తబొమ్మల నీ విప్డు దెత్తువేని
ఇచ్చెదను నీకు ముద్దుల నెన్నియేని."

బాల సంక్రాంతితోడుత మేలమాడి
వత్సరం బయ్యె నెచ్చెలి వచ్చు నంట
ఎప్పుడో యెప్పుడో యని యెదురుచూచు
ఈడుకన్నెలతోఁ గూడి యాడుకొనఁగ.



కుంకుమంబులు చల్లి గొబ్బిముద్దలు వెట్ట
　　పగడాల సొగసును పరిహసింప
పక్షి వ్రాలినభంగి పసుపుముగ్గులు దీర్ప
　　పుష్యరాగంబుల పొలుపుమీఱు

రంగార దీర్చిన రంగవల్లికగుంపు
కన్నెతీఁగలవోలె వన్నెగుల్క
జడలోని మల్లెలు జాజియుండినచోటు
ముత్యాల సొగసుతో ముచ్చటాడ
చీర కుచ్చెళ్ళు పదముల చిందులాడ
తెనుఁగువాకిండ్లఁ దిరిగెడు తీఁగఁబోండ్లు
సరస సల్లాపములు సేయు సమయమందు
పుట్టినింటికి వచ్చెను పుష్యలక్ష్మి.

కాళ్ళ కడియాలు కరముల కంకణాలు
మధుర మధుర స్వనంబుల మాటలాడ
ఆంధ్రగృహముల గారాబు టాడుబిడ్డ
వనిత సంక్రాంతి యల్లన వచ్చునపుడు—

గంపనెత్తిన బెట్టి సొంపుగాఁ జూచుచు
జొన్నచేనున కేగు వన్నెలాఁడి
కొడవలి చేఁ బూని కులుకుచు కులుకుచు
కాశెగడ్డిని గోయఁ గాఁపుకన్నె
పసుపుచీరను దాల్చి బంతిపూవులమాల
లందంబుగా గుచ్చు సుందరాంగి
కమ్మసంపగితోఁట చెమ్మచెక్కల నాడు
చిన్నారి పొన్నారి చెలులగుంపు

ఎదురుగా నేగి "ముద్దుల వదినె, రావె
మేనకోడండ్రు నినుఁ జూడ మిరపతోఁట
పొంత కనుపండు వొనరించు పొగడచెట్ల
విరులు గ్రహియించి తెచ్చెడు వేళ యయ్యె"-

అనుచు నాహ్వాన మొనరించు నవసరాన
ఎవరు పిలిచిరి చెల్లెల, యెందు కింత
సంబరంబుగ వచ్చు సంక్రాంతి యనుచు
తియ్యతీయగ పలికెడు తొయ్యలులును-

ఎన్ని దినముల కే తల్లి నిన్నుఁ జూడ
కనులు వాచెను ర మ్మంచు కౌఁగిలించి
మధుర మధువాక్యముల నాడు మానవతులు-

ఉల్లమలరఁగ మా చిల్క తల్లి కిపుడు
పసుపు కుంకుమ లర్పించి పంపవలయు
ననుచు వచియించు నాప్తులు నలరుచుండ-



ఇల్లు వెనకనె విలసిల్లు మల్లెతోఁట
విరియఁ బూచిన పూలతో వేడ్కసేయ
బీరపాదుల కొక్కింత దూరమందు
కొమ్మచిక్కుడు పందిలి న్గూరుచుండి-

జాను జడ నల్లుకొనుచున్న వారిజాక్షి
లలిత సుకుమారహృదయాన మొలక లెత్తు
తీయతలఁపులు మన కెట్లు తెలియుఁ గాని
నాఁటి పెదవుల చిఱునవ్వు నాట్యమాడె.

పండుగకుఁ దెచ్చుకొన్నట్టి బెండపూవు
వన్నెచీరను ధరియించి వచ్చు పడఁతి
నాగఁటెని దున్నుచుండిన నాథుకడకు
చద్ది గొనిపోవు నొక కాఁపు ముద్దులాఁడి-

నడుము కొడ్డాణ మొక వింత పొలుపు గూర్ప
నిలువు టద్దంబు కెదురుగా నెలఁత యొర్తు
నగుమొగమ్మున కుంకుమ నద్దుకొనుచు
నోరచూపులఁ జూచు నొయ్యార మార-

వంగతోఁటకు వలపట వనిత యొర్తు
దోసతీవెల పండ్లను గోసికొనుచు
యేలపాటలఁ బాడెడు నింపు చూచి
రసిక హృదయాలు సౌందర్య రాజ్య మేలు.

పసులమందను గాఁచెడు బాలుఁ డొకఁడు
చింతకాయలు గోయగా చెట్టు నెక్కి-

కోడె లాకకొన్ని వెంట రా గోగణంబు
జలక మాడఁగ నేగును చెఱువునందు.

చిన్ని లేఁగల యొడల్ చన్ను జేపఁగ నాకు
చొక్కంపు టావుల చక్కదనము
పచ్చని పచ్చికపట్టుల పవళించు
ప్రాయంపు టెద్దుల సోయగంబు
అంకెలు వైచుచు అంపిల్లి పోరాడు
కొమ్ములకోడెల కుమ్ములాట
ఆకులగుడిసెకు అనతిదూరంబున
లీలగా విహరించు లేఁగ సౌరు
అరసి తన కష్ట సుఖముల మఱచిపోయి
కందిచేనున నిలుచున్న కాఁపువాని
కోరమీసాల కొనలందు కోడెవయసు
ముద్దుపడుచుల హృదయాలు మోహాపెట్టు.



సగము నలిగిన పూవులు సిగను గుల్క
రమ్య కంకణ కింకిణీ రవముతోడ
చల్ల చేయుచు నుండెడి గొల్లపడుచు

చిన్నతమ్ముఁడు తొట్టెలో ప్రీతితోడ
ఆడుకొనుచుండ నయిదేండ్ల యక్క యోర్తు

ఉయ్యేలను ఊఁగుచుండెడి యొప్పు జూచి
మందహాసంబు జేసెడు మాతృదేవి—

కమల కావాసయోగ్య మా కనులనుండి
దివ్యవిజ్ఞాన లతికలు తీఁగవాఱ
పురుషసూక్తంబు పఠియించు భూసురుండు
మకరలక్ష్మికి నెయ్యంపు సకులు కారె ?

అంపశయ్యను కొన్ని నాళ్ళధివసించి
కన్నులారగ నొకమాఱు కాంచి నిన్ను
ప్రాణములు వీడఁ దలఁచె మా బ్రహ్మచారి
ఎంత ధన్యవె చెల్లెలా, యింతులందు !

# కాఁపురము

కన్నులను మూసి నిదురించు నన్ను నీదు
కాలి కడియాల చప్పుడు మేలుకొలిపె
దేవి, భవదీయ పద పద్మసేవ తప్ప
ఇతర మేమియు నిఁక నాకు ఇంపు కాదు.

చెలియ, యొకమాఱు నవ్వుము సెలవివార
నోట రాలెడు ముత్యాలు మూట గట్టి
దాచికొందును లుబ్ధుండు ధనమువోలె
పద్యపేటికలోపల పదిల పఱచి.

భీషణంబుగ జ్వలియించు ద్వేషవహ్ని,
జగతి దహియించుచుండెను సైపఁ జాల
వీణ మీఁటుచుబోవుదు విపినములకు
కవిత, కాంక్షించి నీ తోడ కాఁపురంబు.

# ఉగాది

మల్లికాకన్యక మలయానిలుని గాంచి
మురిపెంపు సిగ్గున మొగము వాల్చె
వాసంతికాలక్ష్మి వదనంబు వీక్షించి
కొదమకోయిల భావపదము పాడ
పచ్చికపై మంచుఁ బరికించి యొకముగ్ధ
ముత్యాల సరు లంచు మోసపోయె
నిగనిగలాడుచు చిగురించు తరువుల
తీఁగలు బిగియారఁ గౌఁగలించె
చిలుక గోరువంకలం బోలు చెలులజంట
వలపుతలఁపులు ముమ్మాఱు మొలకలెత్తె
క్రొత్తవర్షంబు జగమను కొమ్మనెక్కి
మేలుకొలిపెదు నీ యుషఃకాలమందు.

## అకరి

హృదయ ముప్పొంగగా నుతిమినచో నీకు
పూజ యొనర్తుము పొన్నపూల
మిఱుమిట్లు గొలుపగా మెఱసిన నియ్యదే
అరటాకు దొన్నెలో యలరుఁ దేనె
చెఱువులు నిండించి స్వీకరింపుము కాన్క
దోరబండిన నేలి దోసపండ్లు
పైరులు చక్కఁగా పండిన నిత్తుము
పండు టాకులలోన పచ్చివెన్న
ధాన్యలక్ష్మి ప్రసన్నయై తనను కొఱకు
వరము వేఁడుదు జోడించి కరయుగంబు
వరుణా, మా వంకఁ జూడుము కరుణతోడ
శబలితం బైన యీ రమ్య సమయమందు.